# 21 PROSPECTS FOR NATURE...

# 21 अपेक्षित

# ప్రకృతి కోసం 21 అంశాలు...

మానసి, కేతకి

తెలుగు: కె. సురేష్

by,

Manasi & Ketaki

oikos
for Ecological Services
since 2002

Hello friends !

It's our pleasure to publish this booklet with **21 prospects for Nature**, compiled during first 21 days of quarantine period to stop spread of Corona virus.

We have tried to come up with activities for everyone in the society. People who has land or some space can follow many activities for sure. Certain activities can be followed by almost everyone in any given condition in cities or rural areas at home front. If more n more people start following these activities nature can be conserved directly or indirectly.

Most of the activities are mainly related to biodiversity. Very soon we will also publish updated version with few more activities to make this compilation more holistic, including all other facets of nature.

Best wishes for nature conservation !
Feedback is welcome !

Regards,
Ketaki & Manasi.

మిత్రులారా!

కరోనా వైరస్ తొలి 21 రోజుల లాక్‌డౌన్‌లో రూపొందించిన "ప్రకృతి కోసం 21 అంశాలు" అన్న ఈ పుస్తకాన్ని ప్రచురించటం మాకు ఎంతో సంతోషంగా ఉంది.

సమాజంలోని ప్రతి ఒక్కరూ ఆచరించగల అంశాలను ఇందులో పొందుపరిచాం. కొంత స్థలం, భూమి ఉన్న వాళ్లు ఇందులోని అనేక అంశాలను తప్పనిసరిగా పాటించగలుగుతారు. గ్రామీణ, పట్టణ ప్రాంతాలలోని అన్ని పరిస్థితులలో చాలా అంశాలను ఇంటి ఆవరణలో ఆచరించవచ్చు. వీటిని ఆచరించే వాళ్ల సంఖ్య పెరుగుతూ ఉంటే ప్రకృతికి ప్రత్యక్షంగా, పరోక్షంగా మేలు జరుగుతుంది. ఇందులోని అనేక అంశాలు జీవ వైవిధ్యతకి సంబంధించినవి. ఈ పుస్తకాన్ని మరింత సమగ్రంగా తీర్చిదిద్దటానికి ప్రకృతిలోని మరికొన్ని అంశాలతో రెండవ ముద్రణను త్వరలోనే తీసుకుని వస్తాం.

ప్రకృతి సంరక్షణకు శుభాభినందనాలు!

మీ అభిప్రాయాలు తప్పకుండా తెలియచెయ్యండి!

భవదీయ,

కేతకి, మానసి

## CHEMICAL FREE HOME

- Clean physically not chemically.
- Use haldi for ants, or herbal pest control for others.
- Soapnut, vinegar based household cleaners are readily available or make them at home.
- Keep some dry twigs, branches for termites in garden, to thrive upon. It will not bother live plants.
- Do not bother a caterpillar if it not eating too many leaves. Observe. It will be pupate soon and a butterfly or a moth come out some day.
- Use Tobacco leaves mixed water to spray on hard pests. Use plant based pesticides if needed

## రసాయనాలు లేని ఇల్లు

- రసాయనాలు లేకుండా ఇంటిని శుభ్రం చెయ్యండి.
- చీమలకు పసుపు, ఇతర పురుగులకు కషాయాలు వంటివి ఉపయోగించండి.
- కుంకుడు రసం, వినిగర్‌తో చేసిన ఇల్లు శుభ్రం చేసే ద్రావణాలు మార్కెట్టులో అందుబాటులో ఉన్నాయి.
- పెరడులో చెదలకు ఆహారంగా ఎండు పుల్లలు లాంటివి ఉంచండి. అవి బతికి ఉన్న మొక్కలను ఏమీ చెయ్యవు.
- ఎక్కువ ఆకులను తినకపోతే గొంగళి పురుగును పట్టించుకోవద్దు. అది కోశస్థ దశకు చేరుకుని సీతాకోక చిలుకగా మారుతుంది.
- మొండి పురుగులకు పొగాకు కషాయం ఉపయోగించండి. అవసరమైతే వేప వంటి సేంద్రియ కషాయాలు, ద్రావణాలు వాడండి.

## FOOD FOREST

- Plant certain trees around your house, in society that will supply nutritious food throughout the year !! Like Mango, Jackfruit, Breadfruit, Hadga, Shevga etc.+ many understory shrubs and herbs like Kuda, Basil, Pudina, Brahmi etc.
- This food forest will also attract birds, bees & pollinators, much needed for biodiversity conservation.

## ఆహార వనం

• మీ ఇంటి చుట్టుపక్కల ప్రదేశాలలో సంవత్సరం పొడవునా పళ్లు దొరికేలా చెట్లను నాటండి!! ఉదాహరణకు మామిడి, పనస, సీతాఫలం, కలింకాయ, మునగ వంటివి. కలబంద, తులసి, పుదీనా, కొండ పిండి ఆకు, బ్రహ్మి వంటి మూలికల పొదలు, మొక్కలు నాటండి.

• ఈ ఆహార వనం వల్ల పక్షులు, తేనెటీగలు, పరాగ సంపర్కం చేసేవి ఆకర్షితం అవుతాయి. జీవ వైవిధ్య సంరక్షణ కోసం ఇవి ఎంతో అవసరం.

## GREEN ROOFS

Grow your food on roof on degradable waste and garden waste!! Direct benefits -

- Fresh, organic veggies available round the year
- Enhances micro-climate by lowering terrace temperature. Self-sufficient homes & small communities for vegetables. Provides an habitat for urban wildlife.
- Energy for pumping water can be compensated against reduced use of fans, less waste transport - dumping issues and less transport required for importing vegetables from farming areas.

## మిద్దె తోట

వంటింటి నుండి, పెరడు నుండి కుళ్లి పోయే చెత్తతో మిద్దె మీద కూరగాయలు పెంచండి. దీని వల్ల ప్రయోజనాలు:

• సంవసత్సరం పొడవునా తాజా, సేంద్రియ కూరగాయలు దొరుకుతాయి.

• మిద్దె ఉష్ణోగ్రతలు తగ్గించటం ద్వారా స్థానిక వాతావరణం మెరుగుపడుతుంది. ఇళ్లు, చిన్న సముదాయాలు కూరగాయలలో స్వయం సమృద్ధిని సాధిస్తాయి. ఇతర జీవులకు పట్టణంలో ఆవాసం కల్పిస్తాయి.

• మిద్దె మీదకి నీళ్లు ఎక్కించటానికి అయ్యే ఖర్చును ఫ్యానులు తక్కువ వాడటం, చెత్త రవాణా తగ్గటం, కూరగాయలు దిగుమతి తగ్గించటం వంటి వాటి ద్వారా పూరించుకోవచ్చు.

## BIODIVERSED COMMUNITY

- Let's start creating biodiversed areas right in cities. The society gardens, common grounds are best areas to initiate this. All you need is a corner in your society or open plot (ranging from 500 sq ft to 2000 sq ft)
- Plant few fruiting & nectar trees like Peepal, Karanj, Waras, Palas, etc. Add some shrubs like Murudsheng, Dhayati, Adulasa, Nirgudi
- Save old growth trees, Let the ground be covered with soil & leaves and not cement or tiles
- Enjoy life with teeming wildlife.

## జీవ వైవిధ్య సముదాయం

• పట్టణాలలోనే జీవ వైవిధ్య కేంద్రాలను సృష్టిద్దాం రండి. దీనికి కాలనీ తోటలు, ఉమ్మడి భూములు అనువైనవి. మీ కాలనీలో 500 నుంచి 2000 చ.అ. స్థలం ఉంటే చాలు.

• వేప, కానుగ, మోదుగ, రావి వంటి పళ్లు, తేనె ఇచ్చే చెట్లను పెంచండి. తంగేడు, వావిలి, అడ్డసారం, సబ్జా వంటి పొదలను కూడా పెంచండి.

• ఎక్కువ వయస్సు ఉన్న చెట్లను కాపాడండి. నేలను సిమెంటు, టైల్స్‌తో కాకుండా మట్టి, ఆకులతో కప్పి ఉంచండి.

• రకరకాల జీవులతో ఉన్న ప్రకృతిని ఆస్వాదించండి.

5




పెద్ద లాన్ వద్దు!

## REDUCE LAWNS

Lawns are a highly resource incentive feature for tropical countries like India, considering the use of water, fertilisers, pesticides. Instead some alternative can be preferred -

- Reduce lawns to smaller area, add thick shrub beds for that green filler effect. Restrict lawn to the area under utilisation for walking / partying
- Create herb lawns of Durva or Mandukparni in surrounding. A variety of patterns can be created using a combination of lawn, herbs, shrubs, and stones to satisfy aesthetics and use !!!

## లాన్ వేయవద్దు!

భారత దేశం వంటి ఉష్ణ ప్రదేశాలలో లాన్ పెంచటానికి నీళ్లు, ఎరువులు, పురుగుమందులు వంటి అనేక వనరులు కావాలి. దానికి బదులు:

• లాన్ విస్తీర్ణం తగ్గించి పచ్చగా కనిపించటానికి గుబురు పొదలను పెంచండి. నడకకి, కూర్చోటానికి ఉపయోగించే స్థలానికి లాన్‌ని పరిమితం చెయ్యండి.

• గరిక, ఇతర స్థానిక జాతులతో లాన్ తయారు చెయ్యండి. లాన్, మూలికలు, పొదలు, రాళ్లను రకరకాలుగా ఉపయోగించి అందమైన, ఉపయోగకరమైన ఆవరణను తయారు చేయవచ్చు!!!

## BACKYARD HABITATS

Let's create small patches of habitats in our urban gardens. All you need is, a small pond (about 2 ft diameter made of cement / soil), some stones, few twigs and 10-15 plants.

- Fill half of the pond with soil + cowdung and plant aquatic plants like Water lily & Neer bramhi, fill it out with water and introduce 5-10 gappi fishes.
- Plant 2-3 shrubs like sabja, sontakka, adulasa, tarwad, dhayati; 1 banana plant, and some ground covers.
- Place a heap of stones and bury some sticks & twigs for birds to rest near the pond

## పెరడులో జీవులకు ఆవాసం

పెరటి తోటలో ఇతర జీవులకు చిన్న ఆవాసాలు తయారు చెయ్యండి. చిన్న సిమెంటు తొట్టి (2 అడుగుల వ్యాసం), కొన్ని రాళ్లు, పుల్లలు, మొక్కలు ఉంటే చాలు.

• తొట్టిని సగం వరకు మట్టి + పేడతో నింపి నీళ్లు పొయ్యండి. కలువ, బ్రహ్మి వంటి మొక్కలు పెట్టండి. అందులోకి 5-10 గప్పి చేపలను విడిచి పెట్టండి.

• తొట్టి చుట్టూ సబ్జా, అడ్డసారం, అరటి వంటి 2-3 మొక్కలు నాటండి. నేలని కప్పి ఉంచే మొక్కలను పెంచండి.

• తొట్టి దగ్గర కొన్ని రాళ్లు పెట్టి, పక్షులు వాలటానికి పుల్లలు పెట్టండి.

## BIRD BATHS

Let's create a provision for water for tiny wildlife.. easiest is the bird bath. A small, shallow terracotta dish is sufficient for this purpose

- Place a rough stone in middle and one more near the edge for birds to sit on
- Now fill this with water and place it on little height in the garden, simply on a pot
- Remember to clean it and fill with fresh water regularly else algae n mosquito problem will arise
- **Please note* : it's not a good idea to feed birds with human food, better have appropriate food plants.

## పక్షులకు నీళ్లు

పక్షులకు, ఇతర చిన్న ప్రాణులకు నీళ్లు అందించండి. ఇందుకు చిన్న మట్టి మూకుడు, లేదా పాత్ర సరిపోతుంది.

• పక్షులు వాలటానికి పాత్ర మధ్యలో, అంచున ఒక గరుకు రాయిని ఉంచండి.

• దీనిని నీళ్లతో నింపి తోటలో కొంత ఎత్తులో ఉంచండి.

• ఈ పాత్రని రోజు కడిగి, తాజా నీటితో నింపండి. లేకపోతే దోమలు ఉత్పత్తి చెందుతాయి.

• *గుర్తుంచుకోండి*: మనం తినే ఆహారం పక్షులకు పెట్టటం మంచిది కాదు. పక్షులకు ఆహారాన్ని ఇచ్చే మొక్కలను పెంచటం మంచిది.

## DEMAND ORGANIC

- Prefer & demand organic ! This applies to everything we eat or use; at home or work place. Just make a shift from synthesised products to natural ! Demands will shape the markets & markets will shape growers !
- So let's start hunting, enquiring and demanding organic produce to vendors, even groceries & online supply chains.

## సేంద్రియ ఉత్పత్తులు కావాలని అడగండి

- సేంద్రియ ఉత్పత్తులు ఉపయోగించండి, కావాలని అడగండి! ఇంటి దగ్గర, కార్యాలయంలో మనం తినే, ఉపయోగించే ప్రతిదానికీ ఇది వర్తిస్తుంది. రసాయనిక ఉత్పత్తులు కాక సహజ ఉత్పత్తులను వాడండి! మీరు వాడటం వల్ల గిరాకీ పెరుగుతుంది, గిరాకీ ఉంటే సాగు ఉంటుంది!
- అమ్మకందారులవద్ద, కిరాణ కొట్లలో, ఆన్‌లైన్ అమ్మకాలలో సేంద్రియ ఉత్పత్తుల కోసం వెదుకుదాం, అడుగుదాం.

## MAKE A FARMER FRIEND !

- Lets have a farmer friend for exchange of goods, ideas, affection, What can be achieved in this relation,
- Food supply from farmer friend to urban family. So assured income for him
- Technological support from urban friend to farmer family
- Direct Cash from city to farm at ‘market price’
- Urban kids get a farm to explore while farm kids get glimpse of city life in safer way.
- Let’s bridge the gap, find your own friend in the vicinity of the city !!!

## రైతుతో స్నేహం చెయ్యండి!

ఆలోచనలు, ఆప్యాయతలు, వస్తువులు ఇచ్చిపుచ్చుకోటానికి రైతుతో స్నేహం చెయ్యండి. దీని వల్ల ప్రయోజనాలు-

- రైతు మిత్రుల నుంచి పట్టణ కుటుంబానికి ఆహారం అందుతుంది, దీనివల్ల వాళ్లకి ఆధారపడదగిన ఆదాయం ఉంటుంది.
- రైతులకు పట్టణ మిత్రులు సాంకేతిక సహాయం చెయ్యవచ్చు.
- మార్కెటు ధర మొత్తంగా రైతుకే దక్కుతుంది.
- పట్టణ పిల్లలకు వ్యవసాయం గురించి తెలుస్తుంది, పల్లె పిల్లలకు పట్టణం గురించి అవగాహన ఏర్పడుతుంది.
- అంతరాలను తగ్గిద్దాం, మీకు దగ్గరలో రైతు మిత్రుల కోసం అన్వేషించండి!!!




వస్తువుల మారకం చెయ్యండి...

## BARTER

Let's start a New Barter within Urban communities .. an old practice lost in time. We do have some extra resources and products which can come in 'New Barter'. Let's reduce shopping, start sharing !

- Search & list things lying in house that have not been used for a year or so.
- Share the list on social media, whatsapp groups help n urge others to do same
- Form closed groups of residents in the vicinity
- Assist exchange. This will obviously save money and more to it conserve resources.

## మారకం

అంతరించిపోయిన మారక విధానాలను పట్టణ సముదాయాలలో కొత్తగా మొదలుపెడదాం. మన దగ్గర ఎక్కువగా ఉన్న వనరులను, వస్తువులను 'మారకం' చేద్దాం. కొనుగోళ్లు తగ్గిదాం, పంచుకోవటం మొదలుపెడదాం!

- ఒక సంవత్సరం పాటు ఉపయోగించకుండా ఇంటిలో ఉన్న వస్తువులను వెదికి, వాటి జాబితా తయారు చెయ్యండి.
- ఆ జాబితాను సోషల్ మీడియా, వాట్సాప్‌లో పంచుకోండి, ఇతరులు కూడా అలా చెయ్యటానికి సహాయపడండి, ప్రోత్సహించండి.
- దగ్గరలో ఉండే వాళ్లతో ఒక సముదాయాన్ని తయారుచెయ్యండి.
- వస్తువుల మారకానికి సహాయపడండి. దీనివల్ల డబ్బు ఆదా అవుతుంది, అంతే కాకుండా వనరులను కాపాడినవాళ్లం అవుతాం.

## BIOFENCE

A BioFence, means a living compound wall, planted with suitable shrub species, intermittent trees and one or two climbers to add diversity. Here is why you should consider a BioFence over a dead cement wall,

- A green living, aesthetically pleasing growing wall.
- A safe habitat for birds, bees, insects to roost, feed, nest or perch during flight. Provides food in form of leaves, fruits, nectar, pollens, bark, twigs to wildlife.
- Passage or corridor for ground dwelling wildlife like mongoose, hare.
- Reduces your ecological footprint of a built wall.

## సజీవ కంచె...

అనువైన పొదలు, కొన్ని చెట్లు, తీగలతో వైవిధ్యతతో నిండిన సజీవ కంచె ఏర్పాటు చెయ్యండి. సిమెంటు గోడ కాకుండా సజీవ కంచె వల్ల లాభాలు-

• పచ్చగా, పెరుగుతూ ఉండే ఈ గోడ అందంగా ఉంటుంది.

• పక్షులు, తేనెటీగలు, పురుగులకు ఆవాసం కల్పిస్తుంది. వాటికి (ఆకులు, పళ్లు, తేనె, పుప్పొడి వంటివాటి రూపంలో) ఆహారం, గూడు కట్టుకోటానికి స్థలం కల్పిస్తుంది.

• ముంగిస, కుందేలు వంటి జీవులకు దారులను కల్పిస్తుంది.

• సిమెంటు గోడ కడితే జీవావరణంపై మీరు మోపే భారాన్ని ఇది తగ్గిస్తుంది.

## STOP FIRES

Fires have devastating effects on our ecosystems. A range of biodiversity gets displaced or killed during extensive fires. Sources of fire are anthropological, like cigarettes, agriculture born, sparks in electrical cable network etc. traversing natural areas. What you can do,

- Initiate awareness amongst the community not to let fire traverse in surrounding when they are using it in agriculture or some such reason
- Watch n report fire to nearby forest officer
- Volunteer for making fire lines.
- Lets reduce carbon emissions and improve air quality.

## మంటలు వ్యాపించనివ్వొద్దు!!

జీవావరణానికి మంటలు తీరని నష్టం చేస్తాయి. విస్తృతంగా వ్యాపించే మంటల వల్ల అనేక జీవులు ఆశ్రయం కోల్పోతాయి, చెట్లు, మొక్కలతోపాటు చాలా చచ్చిపోతాయి. సిగరెట్లు, చేలల్లో పెట్టిన మంటలు, కరెంటు తీగల రవ్వల వంటి మనుషుల చర్యల వల్లే మంటలు రగులుకుంటాయి. మీరు ఏం చెయ్యగలరు-

• చేలల్లో మంటలు పెట్టినప్పుడు చుట్టుపక్కలకు వ్యాపించకుండా రైతులలో అవగాహన కల్పించండి.

• మంటలు చూసినప్పుడు వెంటనే అటవీ అధికారులకు తెలియచెయ్యండి.

• మంటలను అరికట్టడంలో సహాయపడండి.

• కర్బన ఉద్గారాలను తగ్గించి, గాలి నాణ్యతను పెంపొందిద్దాం.

## NATIVE PLANTS

- There is enormous diversity of plants in and around us that are of forest origin, i.e. Native to particular region or habitat. It is important to preserve and propagate them to plant for various purposes. Where can we use Natives,
- All the plantation drives, greening, afforestation activities
- On hills, river banks, roads, farmhouses, forests
- Refer to lists and guidelines on this link, http://www.oikos.in/html/publications.html
- Grow Natives !!! Always...

## దేశీ చెట్లు

మన చుట్టుపక్కల అటవీ మూలాలు ఉన్న అనంత జీవ వైవిధ్యత ఉంది. ఇవి ఆ ప్రత్యేక ప్రాంతానికి స్థానికమైనవి. వీటిని కాపాడటం, వ్యాప్తి చెందేలా చూడటం ఎంతో ముఖ్యం. దేశీ చెట్లను ఉపయోగించే అవకాశాలు:

• చెట్లను, అడవులను, పచ్చదనాన్ని పెంచే సందర్భాలు.

• కొండలు, నదీ తీరాలు, రోడ్డు పక్కన, ఫాంహౌస్‌లో, అడవులలో.

• దేశీ చెట్ల వివరాల కోసం, మార్గదర్శకాల కోసం ఈ లింకు చూడండి:

http://www.oikos.in/html/publications.html

• దేశవాళీ చెట్లను పెంచండి!!! ఎల్లప్పుడూ...

## GROW NATIVE FRUITS

- We have a wide range of wild fruits less known to everyone beyond guava n chiku.
- Let's get introduced to those wild native fruits. These are all very nutritious fruits, rich in vitamins and got some medicinal properties also.
- e.g. Khirani, bhokar, meki, amoni, charoli, dhamodya, alu, jambhul, etc.

## దేశీ పళ్ల చెట్లు పెంచండి

•జామ, సపోటా మాత్రమే కాకుండా అంతగా తెలియని అనేక రకాల అడవి పళ్ల చెట్లు మనకు ఉన్నాయి.

• ఈ అడవి పళ్ల చెట్ల గురించి తెలుసుకోండి. ఇవన్నీ ఎన్నో పోషకాలు కలిగిన పళ్లు, వీటిల్లో అనేక విటమిన్లు ఉంటాయి, కొన్ని మందుగా కూడా పనిచేస్తాయి.

• ఉదాహరణకు నేరేడు, కలింకాయ, తునికి, మొదలైనవి.

## COLLECT WILD SEEDS

Seeds, most important link for propagation of Native plants. Its collection needs to be done with good care,

- Identify the plant, collect seeds of native plants only. Collect those seeds or ripe fruits fallen on ground. Fruits not to be plucked from trees. Collect seeds of that are in abundance, do not aim for rare plants.
- Do not collect them from forest areas, better to collect on main roads and roadsides.
- Collected seeds must be dried in shade, tagged n stored in dry containers till it is handed over to nurseries.

## అడవి రకాల మొక్కల విత్తనాలు సేకరించండి

స్థానిక రకాల వ్యాప్తికి విత్తనాలు ముఖ్యమైనవి, వాటిని జాగ్రత్తగా సేకరించాలి:

• దేశీ రకాల మొక్కలను గుర్తించి వాటినుంచి విత్తనాలు సేకరించండి. పండి, కిందకి రాలిన విత్తనాలే సేకరించండి, చెట్లకి ఉన్నవాటిని కొయ్యవద్దు. మీ ప్రాంతంలో అరుదుగా ఉన్న చెట్ల నుంచి కాక విరివిగా ఉన్న చెట్ల విత్తనాలు సేకరించండి.

• అడవులలోని చెట్ల నుంచి కాక, రోడ్డు పక్కన, రోడ్డుకి కొంచెం దూరంలో ఉన్న చెట్ల నుంచి విత్తనాలు సేకరించండి.

• సేకరించిన విత్తనాలను నీడలో ఎండబెట్టండి. తేమలేని డబ్బాలలో, పేరు వంటి వివరాలు రాసి భద్ర పరచండి.

మొక్కలు పెంచే నర్సరీలకు ఆ విత్తనాలను అందజేయండి.


ARREST INVASIVES...
oikos.in
ఆక్రమణ చేసే మొక్కలను అరికట్టండి...

## ARREST INVASIVES

Invasives are plants or animals introduced by human activities spreading beyond control, altering the natural composition of any area. Let's work together to control their spread,

- No more non-natives in plantions in natural areas.
- Identify Invasives. Invasive removal must be done by mechanical means, without using chemicals or fire.
- Best practice is to uproot when young before flowering or cut the flowers before fruit formation or uproot the entire plant in case of perennial species.
- Repeat this for 3-5 years.

## ఆక్రమణ చేసే మొక్కలను అరికట్టండి

కొత్త ప్రాంతంలోకి మనుషులు ప్రవేశ పెట్టే కొన్ని మొక్కలు, జీవులు ఎటువంటి నియంత్రణ లేకపోవటం వల్ల బాగా వ్యాపిస్తాయి. ఉదాహరణకు గుర్రపుడెక్క, కాంగ్రెస్ గడ్డి (పార్థీనియం), లంబాడా కంప (లాంటానా) వంటివి. వాటిని అరికట్టడానికి కృషి చేద్దాం-

• అటవీ ప్రాంతాలలో విదేశీ రకాలను ఎంతమాత్రం నాటవద్దు.

• ఆక్రమణ చేసే రకాలను గుర్తించండి. వీటిని నియంత్రించటానికి రసాయనికాలు, నిప్పు ఉపయోగించవద్దు.

• పూలు పూయకముందే వాటిని వేళ్లతో సహా పీకివెయ్యాలి, లేదా విత్తనం ఏర్పడకుముందే కోసెయ్యాలి. బహువార్షికాలను వేళ్లతో సహా పీకివెయ్యండి.

• వదిలిపెట్టకుండా 3-5 సంవత్సరాలపాటు ఈ పని చెయ్యాలి.

## PROTECT GRASS COVER

Wild grasses and it's biomass is wealth for any degraded land ! They are important as,

- An insulating layer over top soil, and reduces soil temperature. Mulch / organic matter improves soil.
- A link that increases soil organic carbon and fertility
- A habitat for ground dwelling creatures, Food for insects, grazers and seed eaters
- A layer that catches morning dew increasing soil moisture. Very important stepping stone in ecological succession. Do not cut the grass on land, let it grow, seed, and fall down to form the cover !

## నేలను కప్పి ఉంచే గడ్డిని కాపాడండి

క్షీణతకు గురైన నేలలకు పిచ్చిగా పెరిగే గడ్డిజాతులు ఎంతో మంచివి. అవి:

- నేలను కప్పి ఉంచి, మట్టి ఉష్ణోగ్రతలు పెరగకుండా చూస్తాయి. ఈ మొక్కలు చనిపోయినప్పుడు వాటి సేంద్రియ పదార్థం నేలను సారవంతం చేస్తుంది.
- నేలలో సేంద్రియ కర్బన శాతాన్ని, భూసారాన్ని పెంచుతుంది.
- నేలమీది జీవులకు ఆవాసం కల్పిస్తుంది. పురుగులకు, ఇతర చిన్న జీవులకు ఆహారం ఇస్తుంది.
- ఉదయంపూట ఈ గడ్డి మంచును ఆకర్షించి నేలలో తేమ శాతాన్ని పెంచుతుంది. జీవావారణ పురోగమనంలో ఇది ఎంతో ముఖ్యమైనది. గడ్డిని కొయ్యవద్దు. అది పెరిగి, విత్తనాలు రాల్చి, చివరికి నేలను కప్పి ఉంచనివ్వండి.




మట్టిని దిగుమతి చేసుకోవద్దు!

## Do not import soil ! Make your soil !!

- Let's not deprive our hills for 'greening' our gardens in cities or farm houses or industries
- Let's be more cautious towards these supply chains and make better choices,
- No more red soil for gardens or planting
- Plants grow very well in decomposed matter. So a combination of a variety of plant based materials like leaf litter, cuttings, coco peat, agricultural wastes, dung and decomposable wastes can form the best growing mix

## మట్టిని దిగుమతి చేసుకోవద్దు! సొంతంగా తయారుచెయ్యండి!

• ఇళ్లల్లో, కర్మాగారాలలో పచ్చదనాన్ని పెంచటానికి కొండలను పాడుచెయ్యవద్దు.

• తోటల కోసం, మొక్కల కోసం ఎర్రమట్టిని దిగుమతి చేసుకోవటం మాని, ప్రత్యామ్నాయలను ఆలోచిద్దాం.

• కుళ్లి, చివికిన పదార్థంలో మొక్కలు బాగా పెరుగుతాయి. కాబట్టి రాలిన ఆకులు, కత్తిరించిన మొక్కలు, కొబ్బరి పిట్టు, వ్యవసాయ వ్యర్థాలు, పేడ, కుళ్లిపోయే చెత్త వంటివాటితో మొక్కలను పెంచటానికి కావలసిన మట్టిని తయారుచేసుకోండి.

19




ఫాం హౌస్ పంచుకోండి...

## SHARE A FARMHOUSE

A dream come true for many ! But ecologically it is inappropriate in many ways - A development that has caused much damage to natural setting while making roads, infrastructure & facilities. A house which has replaced original biota now has mostly non-native plant species. A structure that has used all inert materials like cement, tiles, etc, finally creating a lot of construction debris. A house that is used as rarely as 10-15 times a year or even less. Is it a fare transaction ?!

- Let's not burden the earth any more...
- Lets 'share a farmhouse' !!!

## ఫాం హౌస్ పంచుకోండి

సొంత ఫాం హౌస్ ఉండాలన్నది చాలామంది కల! జీవావరణం పరంగా చూస్తే దీనివల్ల చాలా ఇబ్బందులు ఉన్నాయి. వీటికి అవసరమయ్యే రోడ్లు, మౌలికసదుపాయాల కల్పన వంటివాటి వల్ల ప్రకృతికి చాలా నష్టం జరుగుతోంది. స్థానిక రకాలను తొలగించి బయటనుంచి తెచ్చిన చెట్లను పెంచుతారు. సిమెంటు, టైల్స్‌తో కట్టే ఈ ఇళ్లు అంతిమంగా నిర్మాణ వ్యర్థాలకు దారితీస్తాయి, సంవత్సరంలో 10-15 సార్లు, లేదా అంతకంటే తక్కువ ఉపయోగించే ఇంటి కోసం ఇంతటి నష్టం కలిగించటం సరైనదేనా?

- భూమిపై భారాన్ని పెంచవద్దు...
- కొంతమందిమి కలిసి ఫాం హౌస్‌ని పంచుకుందాం!!!

20




అడవులకు తిరిగి ప్రాణం పొయ్యండి

## RESTORE FORESTS

Let's start restoring degraded lands with following guiding principles,

- Perpetual protection to existing habitats and biodiversity from grazing, cutting and fire.
- First restore the physical structure of the soil and then do plantation. Invasives should be removed.
- Restoring 'natural capital' also generates good employment at local level.
- Apart from individual level, a group of friends can come together for concentrated efforts and share budget and resources for a good cause!

## అడవులకు తిరిగి ప్రాణం పొయ్యండి

ఈ మార్గదర్శక సూత్రాలను అనుసరించి క్షీణించిన భూములను బాగు చేద్దాం:

- పశువులు మెయ్యకుండా, కొట్టెయ్యకుండా, నిప్పు అంటించకుండా ప్రస్తుతం ఉన్న జీవవైవిధ్యతను, ఆవాసాలను నిరంతరం రక్షించాలి.
- ముందుగా మట్టి భౌతిక లక్షణాలను మెరుగుపరిచి, చెట్లు నాటాలి. ఆక్రమణ చేసే మొక్కలను తొలగించాలి.
- 'ప్రకృతి మూలధనాన్ని' పునరుద్ధరించటం ద్వారా స్థానికంగా ఉపాధి ఏర్పడుతుంది.
- వ్యక్తిగతంగానే కాకుండా స్థానికంగా మిత్రులు కలిసి ఒక మంచి ఆశయానికి నిధులు, వనరులను పంచుకోవాలి!

# ECO SCHOOL

Conservation starts with nature education. Giving herewith few examples how we can restart -

- Try and identify trees and birds from the surroundings. Observe this throughout the year, note changes in tree, occurrence in birds etc.
- Get field guides, books about nature, evolution, biodiversity and read it regularly!
- Watch your lifestyle! Identify WANT and NEED!
- Be a cautious citizen! Start studying the implications on nature due to our life style. Start with the study of wastes. Where it is going, how it's getting processed.

## జీవ పాఠశాల

జీవావరణ విద్యతో ప్రకృతి సంరక్షణ మొదలవుతుంది. ఏం చెయ్యవచ్చో ఇక్కడ కొన్ని ఉదాహరణలు ఇస్తున్నాం:

• మీ చుట్టుపక్కల ఉన్న చెట్లు, పక్షులను గుర్తించండి. సంవత్సరం పొడవునా ఈ పనిని చేపట్టి చెట్లలో మార్పులు, పక్షులు కనిపించే కాలాలను గుర్తించండి.

• ప్రకృతి, పరిణామం, జీవ వైవిధ్యతకి సంబంధించి పుస్తకాలను సేకరించి ఎప్పుడూ చదువుతూ ఉండండి!

• మీ జీవనశైలిని గమనిస్తూ ఉండండి! అవసరాలు, కోరికల మధ్య తేడాని గమనిస్తూ ఉండండి!

• ఆచితూచి వ్యవహరించండి! మన జీవనశైలి ప్రభావాల గురించి తెలుసుకుంటూ ఉండండి. వ్యర్థాలు ఎక్కడికి వెళతాయో, ఏమవుతాయో అధ్యయనం చెయ్యటంతో మొదలుపెట్టండి.